## కావలెను

ఈ క్రింది ప్రాంతములనుండి గోలకొండ పత్రికకు వార్తలువ్రాయు విలేకరులు కావలయును.

౧. వనపర్తి సంస్థానము
౨. గద్వాల ,,
౩. ఆత్మకూరు ,,
౪. గోపాలపేట ,,
౫. రాయచూరు (టవున్)
౬. నిజామాబాదు ,,
౭ మహబూబునగరము ,,

ఆయా ప్రాంతములవారు విలేఖరులుగా నుండగోరిన మాకు తెలుప ప్రార్థితులు.

సంపాదకుడు

గోలకొండ పత్రిక హైద్రాబాదు

# వెలమ ప్రముఖుల కర్తవ్యము

(సంఘ శ్రేయోభిలాషి)

వెలమజన సంఘము స్థాపింపబడి అయిదు సంవత్సరములు కావచ్చినది. సంఘము స్థాపింపబడిన కొన్ని దినములకే కరీంనగరమునందు వెలమ వసతి గృహ స్థాపన జరిగెను. ప్రస్తుత మీ వెలమజన సంఘముతో పాటు ఈ వసతి గృహము కూడ అభివృద్ధి జెందుచున్నటుల కాన్పించదు. వెలమజన సంఘము మహోత్సాహ పూరితముగ స్థాపింపబడెను. మహాసభయందే సంఘనిధికి ఇరువది వేల రూప్యముల వాగ్దత్తము అనాయాసముగ లభించెను. వెంటనే ముగ్గురు కార్యదర్శులును, గ్రామములందు పర్యటన మొనర్చి మరి పదివేల వరకు వాగ్దత్తములు గైకొనిరి. ఇది ఉత్సాహము తగ్గకమునుపే జరిగిన పని. వాగ్దత్తము లొనర్పబడిన ద్రవ్యమును వసూలు చేయుటకు గట్టి ప్రయత్నములైనను జరిగినటుల కనుపించదు. అధ్యక్షులు, ఉపాధ్యక్షులు లిఖించిన పెద్ద మొత్తము లుంచుకుడు కార్యభారము మీద వైచుకొని సంఘాభివృద్ధికై తీవ్ర కృషిచేయ సమకట్టిన ముగ్గురు కార్యదర్శులైన తమ తమ మొత్తములను పూర్తిగా చెల్లించిరో యని సంశయము కలుగుచున్నది. ఈ రహస్యమును ప్రధాన కార్యదర్శులు బయలుపెట్టెదరని విశ్వసించుచున్నాము.

వెలమజన సంఘ స్థితి యిటులుండ, వసతిగృహ విషయమును కూడ కొంచె మాలోచించవలసి యున్నది. ప్రథమము ఈ వసతిగృహము అన్ని జిల్లాలకు జెందిన నలుబది వేల మంది వెలమ జనులకు అందుబాటులో లేదు. ఇచ్చట ఉస్మానియా హైస్కూలు తప్ప వేరు విద్యాసంస్థ యేదియును లేదు. మహబూబునగరము నల్లగొండ, వరంగల్లు ఆదిలాబాదు మున్నగు జిల్లాలకు జెందిన వెలమ విద్యార్థులు కరీంనగరపు పేరైనను తలపెట్టరు సరికదా! కరీంనగరపు జిల్లాలోకూడ, వెలముల సంఖ్య విశేషముగా నున్న జగిత్యాల తాలూకా వెలమ విద్యార్థులందరును, జగిత్యాల హైస్కూలులో, లేక కోరుట్ల మిడిలిస్కూలులో విద్య నభ్యసించ వెడలెదరు. హుజూరాబాదు తాలూకావారు వరంగల్లునకు పోవ నిచ్చగించెదరు. కరీంనగరమునకు వచ్చు విద్యార్థులందరును అచ్చటి చుట్టుపట్లవారే! వీరిలో విశేష భాగము ప్రాథమిక విద్య నభ్యసించువారై యున్నారు. వీరు దాదాపు స్థానికులగువారగుటచే అధికాంశమువారలను దృష్టియం దుంచుకొని వసతి గృహములో చేరక ప్రత్యేకపు బసలను ఏర్పాటు చేసుకొందురు. కరీంనగర గ్రామమునం పరస్థానికులగు వెలమ విద్యార్థులు గొంపర కుండిన వసతిగృహమునందలి విద్యార్థుల సంఖ్య మాత్రము ౧౫ టికి మించలేదు. ఈ సంగతి వసతిగృహ కార్యనిర్వాహకులకు తెలియకపోదు. ఈ పరిస్థితులందు వసతి గృహమును రెండంటి సహాయములు కలిగించినను బలవంతపు బ్రాహ్మణార్థముగనే పరిణమించుచున్నది. ఈ వసతి గృహము వలన అందరికి లాభము కలుగకపోవుటచే చందాల నిచ్చువారు వెనుకంజ వేయుచున్నారు. ఇది బహిరంగ రహస్యమైనను వెలమజన సంఘ కార్యదర్శులు దీనిని బయలుపుచ్చ జంకెదరు. సత్యదృష్టితో పరికించువారికి వెలమ వసతి గృహమునకు స్థల నిర్ణయము పొరపాటుతో జరిగినదని చెప్పక తప్పదు. ఈ తప్పు నిక నైనను సవరించుకొనిన బాగుండెడిది. మొదటే అల్ప సంఖ్యాకులుగ నున్న వెలమ జనుల యందు సాంఘికాభిమానమును పెంపొందించి చీలి లు కలిగించుట మిగుల హానికరము. కాని ఈ విషయమును వెలమజన సంఘపు ప్రధాన కార్యదర్శిగారు కాని వారి అనుచరులుగాని ఉదార బుద్ధితో నాలోచించుచున్నటుల కన్పట్టదు. వీరు వెలమజన సంఘమునిన కరీంనగరపు వెలమ వసతి గృహమే యను తప్పు ధోరణిని అవలంబించినటుల యున్నది. వీరిటీవల హైద్రాబాదునందు ఉన్నతవిద్య నభ్యసించు కొందరి వెలమ విద్యార్థులకు ధన సహాయము కావలయునని శ్రీయుత మాడపాటి హనుమంతరావుగారు ప్రకటించిన విజ్ఞపనను పడవేసిన శెట్టిరి. హైద్రాబాదు నందలి వెలమ విద్యార్థులకు రెడ్డిజన సంఘమువా రెన్నియో విద్యార్థి వేతనము లొసగుచున్నారు. ఈ మాత్రమైన పనిజేయలేని వెలమజన సంఘమువలన లాభమేమియో తెలియుటలేదు. వెలమ ప్రముఖులు రెడ్డిజన సంఘమువారికి ధనసహాయ మొనర్చి, వారి ద్వార హైద్రాబాదునందలి వెలమ విద్యార్థులకు సహాయ మొనర్చినటుల చేసినచో సాంఘికాభివృద్ధియే కాక దేశాభివృద్ధిగూడ చేసినవారయ్యెదరని నా అభిప్రాయము. ఎట్లైనను వెలమ ప్రముఖులు తమ కర్తవ్యమును ఆలోచించ వలసిన సమయ మాసన్నమైనది. ఇప్పుడు సంఘ కార్యదర్శులు విపరీతాభిప్రాయములను విడినాడి, రాష్ట్రమునంతటికి జెందిన నలుబదివేల వెలమ జనుల సర్వతోముఖాభివృద్ధికి ప్రయత్నింతురని నమ్ముచున్నాను.

# ప్రకటన

ఇందుమూలమున ప్రజలకు తెలియ పరుచునదేమన నగరనీటిశాఖ (మహకమేఅబ్ రసాని) యొక్క ఫిల్టరు హౌస్ను, సదరు నల్లాలు, జేరి నల్లాలు, హైదరాబాదు నగరమునందు వ్యాపించి యున్న జనసంఖ్యకు సరిపోవుటలేదు. అనేకవీధులనుండి నీరు సరిపోవుటలేదని ఫిర్యాదులు వచ్చుచుండుట్ల దీనికై నీటివసతులు హెచ్చించుటకుగాను ఈశాఖ నుండి ఒక స్కీము తయారుచేసి ప్రభుత్వమువారికి సమర్పించు కొనబడినది. ఇది త్వరలో అంగీకరింప బడునను నమ్మకము గలదు.

ఇట్టి మంజూరి అయిన పిమ్మట నీటి గొట్టములు హెచ్చింపబడును. ప్రతిచోటికి నీరు తగినంత చేరుచుండగలదు. ఈస్థితిగతు లనుసరించి ప్రజలు నీరు వృథావ్యయ పరచరని నమ్మెదను. కొన్ని గృహములలో ఉద్యానవనములు గలవు. గృహయజమానులు రాత్రింబవలు నల్లాను విడచియుంచి అవసరముకన్న హెచ్చునీరును పోగొట్టెదరు. కనుక ఇట్టి మహాశయులను కూడ నీటి యుపయోగమున తగుశ్రద్ధ పుచ్చుకొనెదరని నమ్ముచున్నాను. పలయున ప్రజలకు నీరు లేదను ఫిర్యాదు చేయుటకవకాశముండరాదు. అట్లు కాదేని ప్రజాసౌఖ్యము దృష్టి యందుంచుకొని ఈశాఖవారు ఖాస్గీనల్లాలు ఆపివేయవలసి వచ్చును. లేక వాటికి నీరు లెక్కించు యంత్రము నేర్పరచవలసి వచ్చును. నీరు తగినంత లేనందున ౧౩౪౦ ఫ. ఖుర్దాదు నెల ౧౦ తేదినుండి అన్ని నల్లాలను ఉదయము ౬ గంటలనుండి ౧౧ వరకును, సాయంత్రము ౪ గంటలనుండి ౮ గంటల వరకును, నీరు నుంచబడును. ఇతర వేళలో నిల్పివేయ బడును.

సదరు మొహతెమిం
అబ్ రసాని బల్దా

గోలకొండపత్రిక

ప్రజోత్పత్తి నామ సం॥ర చైత్ర బ॥ ౬

బుధవారము

## అఖిలభారత సహకార సంస్థల మహాసభ

అఖిల భారత సహకార సంస్థల మహాసభ యొక్క ద్వితీయ సమావేశము గత శని, ఆదివారములయందు జయప్రదముగ జరిగెనని తెలుపుట కెంతయు సంతసించుచున్నాము. ఈ మహాసభను స్వదేశసంస్థానములలో పెద్దదియగు నీ రాష్ట్రమున కాహ్వానించుట ప్రశంసనీయము. మాకు తెలిసినంతవరకు అన్ని జాతులవారికిని అన్ని వృత్తులవారికిని అన్ని తరగతులవారికిని, సంబంధించిన అఖిలభారత మహాసభ నిజాం రాష్ట్రమునం దింతవరకు జరిగియుండలేదు. దేశాభివృద్ధికి, ప్రజల సౌభాగ్యమునకును, సాంఘిక, నైతిక, రాజకీయోన్నతికిని మూలకారణము సహకారోద్యమము. అట్టి మహాసభ ఈ రాజధానియందు జరుగుటచే సహకారోద్యమము నందీ రాష్ట్రమెంత మాత్రము వెనకబడి యుండలేదని విదితమగుచున్నది.

సన్మాన సంఘాధ్యక్షులగు నవాబ్ బహాదుర్ ఎస్. ఆరావముదు అయ్యంగారు తమ స్వాగతోపన్యాసమునందు నిజాంరాష్ట్రమున నీయుద్యమ మెంతవరకభివృద్ధి జెందినదో దీనికి కేంద్ర సహకారసంఘ మెంతవరకు తోడ్పడినదో వివరించిరి. మన ప్రభుత్వము వారు చేయుచున్న ధనసహాయమును, ఉన్నతాధికారులు జూపుచున్న శ్రద్ధను, ప్రశంసించిరి. మహాసభలు జరుపుటచే ఉద్యమ ప్రచారకులకు నూతనోత్సాహము కలుగునని సూచించిరి సర్ లల్లూభాయి శ్యామలదాసుగారు మన రాష్ట్రమునందు సహకారోద్యమాభివృద్ధిని కొనియాడిరి. ఈ యుద్యమమువలన రైతులకును పారిశ్రామికులకును ఎట్టి లాభములు కలుగునో వివరించిరి. దేశము యొక్క సర్వతోముఖాభివృద్ధికి సహకారోద్యమే మూలాధారమని ప్రబోధించిరి

ఈ మహాసభయందు గావింపబడిన తీర్మానములలో ముఖ్యమైనది అఖిలభారత సహకార మహాసభ నొకటి జరుపుటకై సూచించుట. ఇంతవరకు రాష్ట్రీయ మహాసభలు, రాష్ట్రీయ బ్యాంకుల మహాసభలు వేర్వేరుగ జరుగుచున్నవి దీనికి బదులు అఖిలభారత సహకార సంఘముల మహాసభను జరిపి బ్రిటిషిండియ యొక్కయు స్వదేశ సంస్థానముల యొక్కయు సహకారశాఖాధికారులందరు ఒకే విధమగు పద్ధతి నిర్ణయించుకొని సహకారోద్యమమును వ్యాపింపజేయుటకై ఏకపద్ధతిపై యుద్యమమును నడిపింపబడగలదు. ఇంతియేకాక ఒకరాష్ట్రముయొక్క పరిస్థితులనుండి వేరొక రాష్ట్రమువారు లాభము పొందుటకును, మార్గమేర్పడ గలదు

రెండవ ముఖ్య తీర్మానము రాష్ట్రీయ ధాన్యవిక్రయ సంఘముల నుస్థాపించుట గూర్చినది. కృషీవలులు తాము పండించు ధాన్యమునకు సరియైన వెల లభించకుండుటచే నష్టముల పాలగుచున్నారు పంటల పైననే రైతులకు రూపాయిలవసరముండును. ఆ సమయముననే ధాన్యపు ధరలు తగ్గియుండును. కాని సహకార విక్రయ కేంద్రములను స్థాపించుచో కృషీవలులు పండించు ధాన్యము ఒకచో సమకూర్చి తగు వెలయున్నప్పుడు విక్రయించుటకు వీలగును. దీనిచే వచ్చు లాభము మధ్యవర్తియగు సాహుకారు పొందకుండ సభ్యులకే జెందగలదు. మన ప్రభుత్వము వారీ విషయమున శ్రద్ధ జూపుచున్నారు. త్వరలో ఇట్టి విక్రయ కేంద్రముల స్థాపింప బడుననుటకు ఆశ గలదు.

ఇంతియేకాక ఈ సభయందు వేమవరపు రామదాసు పంతులుగారిచే ప్రవేశ పెట్టబడిన సంఘముల తనఖీ గూర్చిన స్కీముపై తీవ్రముగ చర్చ జరిగిన పిదప నామోదింపబడెను. దీని ప్రకారము సంఘముల పరిశీలించు బాధ్యత కేంద్ర బ్యాంకులపై నుండగలదు. లెక్కల తనఖీ రాష్ట్రీయ సహకార సంస్థ చేయవలసి యుండును దీనికి జిల్లా సంస్థలుకూడ నుండగలవు. అఖిల భారత సహకార పత్రికకూడ కొంత చర్చజరిగిన పిమ్మట ప్రచురించుటకై తీర్మానింప బడెను.

ఈ మహాసభ నిచటికాహ్వానించిన హైదరాబాదు కేంద్ర సహకార సంఘమువారు ప్రశంసనీయులు. ఈ సంస్థ వలననే నీ రాష్ట్రములో సహకారోద్యమము వ్యాపించుటకు వీలుకలిగినది. ముఖ్యముగ సహకార శాఖను సంస్కరించి, సరియైన పద్ధతులపై ఉద్యమమును నడుపుటకు మార్గమేర్పరచి, స్వల్ప కాలములోనే అఖిల భారత సహకార సంస్థల మహాసభను కూడ నాహ్వానించు నంతటి స్థితి యీ రాష్ట్రమునకు కలిగించిన ఈ శాఖా కార్యదర్శులగు కాలిన్సుగారభివందనీయులు. వీరి ప్రయత్నముచే ఈ రాష్ట్రమున సహకారోద్యమము గ్రామ గ్రామమునకు వ్యాపించుగాత!

### కలహ బీజములు

ఈ రెండుమూడు వారములనుండి భారత దేశమున విషవాయువులు వీచినవి. మూడేండ్ల క్రిందట సంవత్సరము నుండి భారతీయులలో యుద్భవిల్లిన స్వాతంత్ర్యేచ్ఛను తలక్రిందుల జేయుచున్నవి. ప్రథమమున బెనారసులో కలహ బీజములు విత్తబడెను. అవి కాన్పూరులో మొలకలెత్తి శాఖోపశాఖలయ్యెను. ఉత్తర దేశమునందలి యీ బీజములే తక్షణ ఫలమున క్షేత్రములకు ప్రస్తుతము ప్రయత్నించు సూచనలు పొడకట్టుచున్నవి. ఇందుకు మన రాజధానియందీ వారమున జరిగిన మత విషయిక చర్చలే నిదర్శనము

కొందఱు "సారే సంసార్ కో ఆర్య బనావో" అనగా ప్రపంచము నంతయు ఆర్యగా మార్చుము అను వాక్యమునుండి ఇతరమతస్థులలో ద్వేష భావములు పొడసూపుటకు కారణమయ్యెనని తలంచుచున్నారు దానికి తోడుగ ఆర్యసమాజ వార్షికోత్సవ సందర్భమున నొసగబడిన యుపన్యాసములు ఉద్రేకము కలిగించెనని భావించుచున్నారు. ఇది యెంతవరకు సత్యమో ఆ సభలయందు పాల్గొనిన వారికి తెలియకపోదు. ఆ ఉపన్యాసముల వలన తమ మతమునకు హాని కలుగుచున్నదనియు, అపోహములకు తావొసగ బడెననియు, తలంచి మొన్న సోమవారమునాడు ముసల్మానుల సేవా సంఘమగు అంజుమనె ఖాదిముల్ ముసల్మీను వారు విక్టోరియా కంపౌండులో సభ జరిపిరి. ఇందు "ఫారోక్" పత్రికా సంపాదకులగు మీర్ ఖాసిం అలీ సా॥ ఇస్లాం మతము ప్రపంచ మంతటను వ్యాపింపదగిన మతమనియు, కాని ఆర్యసమాజీయులు చెప్పునట్లు వైదిక మతమట్లు కాదనియు, పలయనవుడు ఒకటిన్నర వేదమే కలదనియు, వేదభాష మృతభాషయనియు, వేదములను చదివించు వారును, చదువు వారును లేరనియు, నుడివిరి. దీనికి ఉపన్యాసకులు వారికి తోచిన యుదాహరణముల నిచ్చిరి. హేళన వాక్యములను బలికిరి వీరి యుపన్యాసమునందు సూచించిన విషయములెంతవరకు నిజమో, వీరవలంబించిన విమర్శనా పద్ధతి సహేతుకమైనదో కాదో, తెలుపుట వైదిక మతావలంబుల ధర్మమై యున్నది. కాని ఈ మౌల్వీ సా॥ యుపన్యాసము వలన ప్రజలలో నుద్రేకము కలుగలేదా? "సారే సంసార్ కో ఆర్య బనావో" అను వాక్యముచే శాంతికి భంగము కలుగునని సూచించిన వారిని ప్రశ్నించుచున్నాము.

ఎవరి మతము వారికి ప్రియమైనది. హిందువులకు రాముని పైనున్న భక్తి ప్రేమ ముసల్మానులకు రహీం పైనను, క్రైస్తవులకు ఏసుక్రీస్తు పైనను, ఉండును. ఒక మతమువారికి వేరొక మతస్థుల పద్ధతులు విపరీతముగ తోచును. ఇది మనుజ స్వభావము. ఈ స్వభావమును మార్చుట దుస్సాధ్యము. మతము నకు ప్రాముఖ్యత నొసగరాదని రాజకీయవేత్తలిపుడు భావించుచున్నారు. ముఖ్యముగ దాస్యమునందున్న భారత దేశము మతమును కట్టిపెట్ట వలయునని సూచించుచున్నారు. అట్టిచో మత ప్రచారము నకై పూనికొని సాంఘిక కలహములు చెలరేపుట భావ్యము కాదు. మత కలహము లింతవరకు చాల నష్టము కలిగించినవి. దేశీయులు తమభావములు మార్చుకొనకున్న ముందింకను కష్టములు హెచ్చగలవు. గాంధీ మహాత్ముడు, మౌలానా అబుల్ కలాం ఆజాదు వంటి నాయకులు హిందూ ముస్లిం ఐక్యతకై పాటుపడుచున్నారు. దాస్య విముక్తికై ప్రయత్నించుచున్నారు. అట్టియెడ దేశీయులు కలహ బీజములను విత్తుటకై పూనుకొనుట సంభావ్యము గాదు. ఇకనైనను దేశీయులు కనులుదెరచి మూర్ఖపు పట్టుదలలను మానుకొందురు గాక!

---

## సహకారము కామధేనువు

### నరసింహదేవర సత్యనారాయణ గారి యుద్బోధ

నేటి సాయంత్రము 6-20 గంటలకు దివాన్ బహాదురు ఆరావముదు అయ్యంగారు బి.ఏ.బి.ఎల్ ఓ. బి. యి. గారి యాజమాన్యమున కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయమున ఆంధ్ర యువజన సంఘము పక్షమున నొక సభ సమావేశమయ్యెను ఈ సభ అఖిల భారత సహకార ద్వితీయ మహాసభకు విచ్చేసిన గౌరవనీయులగు వి. రామదాసు పంతులు సహకారోద్యమమునందు విశేష కృషి సలుపుచున్న శ్రీ నరసింహదేవర సత్యనారాయణ భారతీసేవా సంఘ (సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసాయిటి) సభ్యులగు శ్రీ వాజిపేయ వేంకట సుబ్బయ్య గారల సహకారోద్యమము గూర్చిన యుపన్యాసముల వినుటకు సమావేశపరుపబడెను సభకు ఆంధ్ర ప్రముఖులగు రావు బహాదురు సామల వేంకటరెడ్డి రాజా బహాదురు పిల్లె ప్రొఫెసరు సిరుగూరి హనుమంతరావు మాడపాటి హనుమంత రావు గారలు మొదలగువారు విచ్చేసిరి. యువజనుల సంఖ్య హెచ్చుగానుండి అత్యుత్సాహులుగా గనుబడుచుండిరి.

శ్రీయుత మాడపాటి హనుమంత రావు పంతులు గారు దివాను బహాదురు ఆరావముదు అయ్యంగారిని అధ్యక్ష పీఠము నలంకరించుటకు కోరుచు నేడు మన ఆంధ్ర సోదరులకు వి. రామదాసు సత్యనారాయణ వేంకట సుబ్బయ్య గారల ఉపన్యాసములను వినుటకు ఈ సభ సమావేశపరుపబడెననియు రామదాసు పంతులు గారు కొన్ని కార్యముల వలన ఢిల్లీకి వెడల వలసివచ్చెననియు అందుచే వారు కృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయమునకు విచ్చేసి భాషానిలయమును తిలకించి పోయిరనియు ఈ సభకు సహకారోద్యమము నందు విశేష కృషి సలుపుచున్నట్టి దివాన్ బహాదురు ఆరావముదు అయ్యంగారిని అధ్యక్షులుగ నుండుటకు కోరుచున్నామనియు నుడివిరి దీనిని రెడ్డి విద్యాలయ విద్యార్థియగు భాస్కరరావు గారు బలపరచిరి అంత సద్యస్యులు కరతాళ ధ్వనుల మధ్య అధ్యక్ష పీఠము నలంకరించిరి.

అధ్యక్షులు శ్రీ నరసింహదేవర సత్యనారాయణ గారిని సభ్యులకు పరిచయము చేయుడని సిరుగూరి హనుమంతరావు గారిని కోరగా వారు సత్యనారాయణ గారు తనకు సుమారు ౨౦ సంవత్సరములనుండి పరిచయస్థులనియు తాము మదరాసు విశ్వవిద్యాలయమున విద్యార్థిగానుండు సమయమున సత్యనారాయణ గారు భారతి సేవకా సంఘమునందు విశేషకృషి సల్పెడివారనియు వీరు సహకారమునందు విశేషానుభవముగలవారనియు తెలిపిరి శ్రీయుత గాడేపల్లి సూర్యప్రకాశ రావు గారును సత్యనారాయణ గారు తమకు పూర్వస్నేహితులనియు వారొనర్చిన పెక్కు మన కార్యములను తెలుపుచు నుపన్యసించిరి

తదుపరి శ్రీ వాజిపేయ వేంకట సుబ్బయ్య గారు సత్యనారాయణ గారిని పరిచయమొనరించుచు సహకారోద్యమము సుమారు ౨౫ సంవత్సరములకు పూర్వమే ప్రారంభింపబడినను పట్టణవాసులకేగాక పల్లెవాసులకును లాభకారి యయ్యెనని గ్రామ

భావలోకనము వలన తెలియుచున్నదనియు తామీ యుద్యమమే తీరున గలదో యని చూచుటకు చాల గ్రామములకు వెళ్లితిమనియు అందు పెక్కు గ్రామములలో నీ యుద్యమము నిరుత్సాహకరముగా నుండెననియు ఒక అలమూరు నందు మాత్రమిది యుత్సాహకరముగా నుండెననియు అందుకు కారణము సత్యనారాయణ గారి కృషియే యనియు అచట ఈ యుద్యమము వలన నెందరో నిరుద్యోగులుగా నున్న వారిపుడు కృషికులై సౌఖ్యము నొందుచున్నారనియు స్త్రీలు గూడ నీ సంస్థల యందు ఋణముల గైకొని నెయ్యి మొదలగు వ్యాపారముల నొనర్చుచున్నారనియు నొక గొల్ల మొదట పేద దరిద్రుడై యుండి సహకార సంఘము నొద్ద ఋణముగైకొని దాసిచె గొరెలను గొని యిపుడు అభివృద్ధిని పొంది ఏబది గొర్రెలను సంపాదించుకొనుటయే గాక సుమారు మూడు నాలుగు వందల రూప్యములను గడింపగలిగెననియు ఈ యుద్యమముచే సాంఘిక రాజకీయ నైతిక జీవనమునకు సహకారియై యుండగలదనియు తెలిపిరి.

పిమ్మట శ్రీ నరసింహ దేవర సత్యనారాయణ గారు గ్రామ పునరుద్ధరణకు సహకారోద్యమ అవసరము గూర్చి నుపన్యసించుచు నిట్లు నుడివిరి.

నేను విద్యార్థిని నేను సహకారోద్యమమే యే ప్రాంతములందెట్లు జరుగుచున్నదో తెలిసికొని దాని ఉత్కృష్ట విధానము నాచరణలోనికి దెచ్చుటయేనా ముఖ్యోద్దేశము. సహకారోద్యమము బీదజనులకు కల్పవృక్షము కామధేనువు పదునెనిమిదవ శతాబ్దము లోనిది పాశ్చాత్య దేశములలో ప్రారంభింప బడెను అచ్చట అనగా ఇంగ్లాండు నందు కర్మాగారములందు కూలీలను యంత్రములుగా భావించగ వారు తాము మనుజులని తెలిసికొనుట దుస్సహమయ్యెను సహకారోద్యమము నందు ఎపుడు వీరు చేరిరో సహకారోద్యమము మెపుడు యింగ్లాండునందు తలయెత్తెనో అపుడే ధనవంతులగు వారిపట్ల కూలీలు తమ విముఖతను జూపుచు నొక విప్లవము బయలు దేరదీసిరి. పాశ్చాత్యసంపర్కము వలననే సహకారోద్యమమును మనదేశమునందు ప్రబలెనను నవ భ్రాంతిలో నేను లేను ఈ యుద్యమము పూర్వ కాలమునుండియు మనదేశమునందుండెను కాని మధ్యనది మంతరించెను ఇందులకు కొంతవరకు మన పూర్వికుల గ్రామ జీవితమును వారి సహకారోద్యమమును పరికింతము ముందు నీటినిగూర్చి యెత్తుకొందము గ్రామస్థు లందరును కలిసియొక తటాకమును నిర్మించిరి దానిపై ధనవంతులు

మొదలుకొని నిరుపేదల వరకును సమానాధికారమే యుండెను. ధనవంతులగువారు బంగారు పాత్రయందు నీరుదెచ్చుకొను చుండిరి అంతకు తక్కువవారు ఇత్తడి పాత్రలలో తెచ్చుకొను చుండిరి నిరుపేదలగువారు మట్టికుండలలో తెచ్చుకొను చుండిరి కాని యందరును నదే నీరును తెచ్చుకొను చుండిరి గాలి నీరు మొదలుకొని వారునిత్య జీవిత పదార్థము లన్నియు నీ సహకార విధానము వలననే జరుగుచుండెను రాజ వీధిని చూచుడు దీనిపై నందరికిని నే నాధికారమే జలదు ప్రాచీన కాలమునందు ఇప్పటివలె ఊరుబయట శౌచస్థలమైన నంచకుండునట్లు గ కత్తోటలు పెంపు చేయుచుండిరి దీనిపై గ్రామ జనాభావే యధికారమే యుండెను. ఇటులనే దేవాలయమునందుగూడ సమానాధికారమే యుండెను. ఊరివారందరను కలసి యొక యుపాధ్యాయుని నియమించుచుండిరి. అతడు వీరందరి బాలురకు సరి సమానముగా విద్యను చెప్పుచుండెను. ఇంతయేల మరణించిన పిమ్మట కాలబెట్టుటకొక శ్మశాన వాటిక గూడ ప్రత్యేకింప బడుచుండెను. మొత్తముపై గ్రామాభివృద్ధికిని గ్రామ సౌష్ఠవమునకును నేయే విషయ లావశ్యకములో నవియన్నియు సహకార మార్గముననే చేకూర్చ బడుచుండెను సహకారమునకు ముఖ్య సూత్రములు రెండే ఒకటి దమ్మిడీ తామ సహాయము చేసికొనుట మఱొకటి తనలో తామే సహాయము చేసికొనుట దీనినే ఆంగ్లమున సెల్ఫు హెల్పు, మఱియు మ్యూచువల్ హెల్పు అ యందురు. ఒకపర్యాయము యువకులు సురేంద్రనాథ బెనర్జీగారిని తామేమి చేయవలయునని యడుగగా ఆర్గనైజు అని నుడివిరి. అటులనే మఱొకసారి యడుగగా నదే ప్రత్యుత్తర మొసగిరి. కావున అర్గనైజు (నిర్మాణము) ముఖ్యము

ఉపన్యాసకులు తమ యుపన్యాసమును సాగించుచు అర్థబలమును అంగబలమును మన యొద్దను గలవనియు, కాని దీనిని వికృతముగ వినియోగింప గూడదనియు ఉదాహరణ సహితముగా తెలిపిరి.

అధ్యక్షులవారు ఉపసంహారోపన్యాసమునందు సహకారోద్యమ యావశ్యకతను నిరూపించిరి సురవరం ప్రతాపరెడ్డిగారు అధ్యక్షులకును, ఉపన్యాసకులకును వందనము లర్పించిన పిమ్మట సభ రాత్రి ౮–౧౫ గంటలకు ముగిసెను.

---

గోలకొండ పత్రిక

ఏజంట్లు

హైదరాబాదు

1 జి॥ ఆర్. మూర్తి రబ్బర్ స్టాంపు మేకరు & స్టాటిషనర్ గౌలిగూడ
2 నా॥ గౌరీశంకరవర్మ రెసిడెన్సీబజారు
3 టి. ధర్మయ్యాచార్యులుగారు భువనగిరి జి॥నల్లగొండ



REG No N 45

Reg. No. M. 2185


గోలకొండపత్రిక
(తూపు బజారు హైదరాబాదు దక్కన్.

సంవత్సరము చందా

రు. ౭—౦—౦
అర్ధ ,, ౩—౧౨—౦

విడి పత్రిక ౦—౧—౪


Printed and published by [illegible] the Golkonda Power Press, Hyderabad Ld tor K Balakrishna Reddy